**శ్రీ సద్గురుభ్యో నమః**



# విజ్ఞాపన



గుప్త దృగ్గణిత పంచాంగ పాఠకులకు నమస్సులు, ఈ పంచాంగ సిద్ధాంత నిర్మాణ భాగమైన తిథి వార నక్షత్ర యోగ కరణము గ్రహపాదచారలు లగ్నపట్టికలు, గురు శుక్ర మౌఢ్యములు, గ్రహణములు మొదలగునవి. భారత ప్రభుత్వ సమ్మత భారతదేశ పంచాంగ సంస్కార కమిటీ నిర్ణయించిన చిత్ర ఫక్ష అయనాంశ రీత్యా గుణించబడినది, ఈ పంచాంగం నందలి పండుగలయొక్క నిర్ణయం ధర్మశాస్త్ర గ్రంథములయిన నిర్ణయసింధు, ధర్మసింధు, విష్ణుధర్మోత్తరపురాణం ఆధారంగా నిర్ణయించడమైనది.

ఈ పంచాంగంనందు శ్రీ జయ నామ సంవత్సర చాంద్రమాన సంవత్సర ప్రారంభం నుండిచాంద్రమాన సం॥అంత్యం వరకు గ్రహస్ఫుట యుక్తంగా రాశిచక్రములు నిర్మించబడినవి, ఆంధ్రప్రదేశ్‌లోని మధ్యప్రాంతమైనరాజమండ్రి పట్టణమునకు లగ్నఅంత్యములు గుణించబడి నవి, ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలకు, కర్ణాటక రాష్ట్రంలోని అన్ని జిల్లాలకు భారతదేశంలోని ముఖ్య పట్టణములకు ఎంతసంస్కారించుకొనవలెనో దేశాంతరసంస్కారపట్టికను నిర్ణయించడ మైనది, రాశిచక్రంలోని గ్రహస్ఫుట ఉదయం 5 గం॥ 30 ని॥లకు (IST) నిర్ణయించబడినది, నక్షత్ర, తిథి, యోగ, కరణములయొక్క అంత్యములు, అమృతకాల,వర్జ్య, దుర్ముహూర్త కాలముల ఆద్యంతములు, రాహుకాల, యమగండకాల ఆద్యంతములు వివరించబడినవి, రాశి చక్రంలో నిర్ణయించిన సూర్యోదయ సూర్యాస్తమయములు ఆంధ్రప్రదేశ్ మధ్యప్రదేశం అయిన రాజమండ్రి పట్టణమునకు నిర్ణయించబడినవి.

ఈ పంచాంగంనందు ఫలితభాగమున జగల్లగ్న, వర్షలగ్న కుండలి ద్వారా వివరించిన దేవభవిష్యత్, ప్రజలభవిష్యత్, వ్యవసాయ వ్యాపార రాజకీయ రంగాలభవిష్యత్,ప్రకృతి వైప రీత్యాలు, వర్షయోగాలు, ధరలు గూర్చిన వివరణ, జ్యోతిశాస్త్ర పితామహులు పరాశర సిద్ధాంత రీత్యా నిర్ణయించడ మైనది. ఈ పంచాంగం నందలి ప్రాగ్దిశాధి నవగ్రహ కారకత్వ సమాచార పట్టికలో నవగ్రహములకు సంబంధించిన ఎంతోవిలువైన సమాచారంఅందించితిమి, ద్వాదశ రాశిఫలాలు కూడా వివరిస్తున్నాము.

ఈపంచాంగంనందు శుభముహూర్త నిర్ణయంపరాశరసిద్ధాంతరీత్యా నిర్ణయించ బడినది, ఈ ముహూర్త నిర్ణయ విధానంమీద ప్రత్యేకంగా ఒకవ్యాసంకూడ వివరించితిమి, జ్యోతిషపండితులు గమనించగలరు, ఈపంచాంగంనందు పరాశర సిద్ధాంతరీత్యా నవగ్రహ శాంతి విధానం, దేవశిల్పి విశ్వకర్మ సిద్ధాంతరీత్యా సప్రమాణ జ్యోతిర్గృహ వాస్తుశాస్త్రం వివరించితిని, బుధగ్రహాధిపతి దేవుడు అయిన గణపతి యంత్రం పూజావిధానం వివరించి తిని, యంత్రస్థాపన ద్వారా అద్భుతమైన శుభఫలితములు పొందవచ్చును, నవగ్రహదేవతలు గూర్చిన ప్రత్యేక వ్యాసం వివరించితిని.

రాహుకాలం సౌరమానీయులకేగాని చాంద్రమానీయులకు కాదు అని శాస్త్రప్రమా ణం. ముహూర్తనిర్ణయంలో రాహుకాలం వుండిన దోషరహితంగా భావించరాదు. వారి ప్రాంతీయ ఆచారాన్నిబట్టి రాహుకాలంలో ముహూర్త సమయంవున్నా ఆసమయంలో ముహూర్తం వద్దనుకున్న వారు ఆ సమయంను విసర్జించవచ్చును. యమగండ కాలం ప్రయాణమునకు మాత్రమే.

ఉ :ఉదయం; మ : మధ్యాహ్నం; సా : సాయంత్రం; రా : రాత్రి; తె : మరుసటి దినము సూర్యోదయపూర్వం అని పంచాంగములో వున్న అక్షరాలను గుర్తించేది. లగ్నాంత్యకాలాలు పాఠకుల సౌకర్యార్థం గతసం॥పంచాంగంలో రైల్వేటైమ్‌లో ఉన్నవి 2010-2011 శ్రీవికృతి నామ సం॥ నుండి A.M., P.M లలో వివరిస్తున్నాము. మధ్యాహ్నం 12గం॥పైన రాత్రి 12 గం॥లోపు P.M అని, రాత్రి 12 గం॥పైన మధ్యాహ్నం 12 గం॥లోపు A.M అని పాఠకులు గ్రహించేది. పాఠకులు ఉత్తర ప్రత్యుత్తరముల కొరకు రిప్లై కార్డు జతపరచి పంపగలరు.

పాఠకదేవుళ్ళు ఈపంచాంగాన్ని ఆదరించి తగిన సూచనలు సలహాలు తెలియజేయా లని విన్నవిస్తూ ముగిస్తున్నాను.

ఇట్లు, మీ పంచాంగ రచయిత

**డా॥ చిత్రాల గురుమూర్తి గుప్త సిద్ధాంతి**

డోర్‌నెం. 14-214, కమలానగర్, వరుణ్ చిన్నపిల్లల ఆసుపత్రి ఎదురుగా,

అనంతపురం - 505101

# అంకితం

పూజ్యులు జ్యోతిషశాస్త్ర ప్రథమ గురువులు పరాశర జ్యోతిషశాస్త్రరీత్యా
నవీన దృక్కులు చూపిన జ్యోతిష పరిశోధకులు కీ॥ శే॥ శ్రీశ్రీశ్రీ తిరుమల నల్లాన్
చక్రవర్తుల వేంకట వరదాచార్యులు గారికి ఈ పంచాంగము అంకిత మొనర్చుచున్నాను.



పంచాంగ కర్త :
డా॥ చిత్రాల గురుమూర్తి గుప్త సిద్ధాంతి
అనంతపురం



## నవగ్రహాధిపత్య దేవతలు వేద, పురాణ, ఉపనిషత్, ఇతిహాసాల ద్వారా శాస్త్ర ప్రమాణాలు

జ్యోతిశ్శాస్త్ర పితామహులు పరాశర మహర్షి గ్రహ దిక్కులను గూర్చి ఈ విధంగా వివరించెను.

శ్లో॥ అర్కశ్శుక్రారాహ్వార్కి చంద్రజ్ఞ గురువః।
క్రమాత్, పూర్వాదీనాం దిశామీశాః ప్రకథ్యన్తే బుధోత్తమైః॥

తా. రవి తూర్పునకు, శుక్రుడు ఆగ్నేయమునకు, కుజుడు దక్షిణమునకు, రాహువు నైఋతికి, శని పశ్చిమమునకు, చంద్రుడు వాయువ్యమునకు, బుధుడు ఉత్తరమునకు, గురువు ఈశాన్యమునకు అధిపతులుగా చెప్పబడినది.

రాశిచక్రమున రాహువునకు వ్యతిరేక రాశిలో (సమసప్తక రాశిలో) కేతువు సంచరించును. కావున నైఋతికి వ్యతిరేక దిక్కు ఈశాన్యంలో కేతువును నియమించవచ్చును. అపుడు ఈశాన్య దిశకు కేతువు గురువు ఇరువురు అధిపతులు అగుదురు. అందుకే మనమహర్షులు గృహనిర్మాణంలో ఈశాన్యం పెంచుటకు ప్రాధాన్యత నిచ్చిరి. ప్రతి దిశలో ఒకగ్రహం ఉండును. ఈశాన్యంలో మాత్రం గురు కేతువులు ఉందురు. కేతువునకు స్థలము వదులు కొరకు ఈశాన్యమును కొద్దిగా పెంచుదురు.

గ్రహరూపిజనార్ధనా, గ్రహరూపి మహేశ్వర అన్న పరాశర మహర్షి ప్రవచనరీత్యా 5 గ్రహములు రవి, చంద్ర, కుజ, గురు, కేతు గ్రహ ములు వైష్ణవ గ్రహములుగాను, 4 గ్రహములు శని, శుక్ర, బుధ, రాహు గ్రహములు శైవ గ్రహములుగాను విభజించిరి.

రవి తూర్పు దిశకు అధిపతి, వైష్ణవగ్రహం, పురుషగ్రహం, సూర్య వంశములో జన్మించిన వైష్ణవదేవుడు శ్రీరాముడు అయినందున రవి గ్రహాధిపత్యదేవుడు శ్రీరాముడు అగును, దక్షిణ దిశాభిముఖంగా నిర్మిం చిన హనుమాన్ దేవాలయములందు హనుమంతుడు రాముని దిక్కు అయిన తూర్పును చూచుచుండును.

శుక్రుడు ఆగ్నేయ దిశకు అధిపతి, శైవగ్రహం, స్త్రీగ్రహం, శైవసంబంధ స్త్రీదేవత దుర్గాదేవి అయినందున శుక్ర గ్రహాధిపత్యదేవత దుర్గాదేవి అగును.

కుజుడు దక్షిణదిశకు అధిపతి, వైష్ణవ గ్రహం, పురుషగ్రహం, యవ్వనకారకుడు, కొండలకు అధిపతి, యవ్వనమున ఉండి కొండను మోస్తున్నవారు హనుమంతుడు అయినందున కుజ గ్రహధిపత్య దేవుడు హనుమంతుడు అగును, ప్రసిద్ధమైన హనుమాన్ దేవాలయాలు దక్షిణాభిముఖంగా ఉండడంలో దేవరహస్యమిదియే.

రాహువు నైఋతి దిశకు అధిపతి, శైవగ్రహం, సర్పగ్రహం, సర్ప రూపంగా పూజించబడుతున్న శైవదేవుడు సుబ్రహ్మణ్యస్వామి మాత్రమే, అందుకే ప్రముఖ సుబ్రహ్మణ్యస్వామి క్షేత్రాలు ఎన్నింటియందో సుబ్ర హ్మణ్యస్వామి సర్పరూపంగా పూజించబడుచుండును, అందుచేత రాహుగ్రహాధిపత్య దేవుడు సుబ్రహ్మణ్యస్వామి అగును.

శని పశ్చిమ దిశకుఅధిపతి, శైవ గ్రహం, ఆయుస్సు కారకుడు (మనిషిని లయము చేయువాడు) లయకారకుడు శివుడు, శివునికారక త్వాలు శనియందు ఉన్నందున శని శనేశ్వరునిగా పిలువబడు చున్నాడు, అందుచేత శని గ్రహాధిపత్య దేవుడు శివుడు అగును.

చంద్రుడు వాయువ్య దిశకు అధిపతి, వైష్ణవ గ్రహం, వైష్ణవ సంబంధ స్త్రీదేవత లక్ష్మీదేవి అయినందున చంద్రగ్రహాధిపత్య దేవత మహాలక్ష్మిఅగును, పద్మపురాణమున తెల్పిన లక్ష్మిఅష్టోత్తర శత నామస్తోత్రము నందు చంద్రమండల మధ్యస్తే చంద్రాంచంద్రసహో దరీం అన్నప్రవచనరీత్యా చంద్రమండలంలో లక్ష్మీదేవిని నివసించును.

బుధుడు ఉత్తరదిశకు అధిపతి, శైవగ్రహం, ఉత్తరదిశన నిద్రించు చున్న ఏనుగు తలను ధరించిన వినాయకుడు బుధగ్రహాధిపత్య దేవుడు అగుదురు, బ్రహ్మవైవర్త పురాణానుసారము సత్త్వాధిపతి విష్ణువే(కృష్ణుడు) పుణ్యక వ్రతానుష్ఠానమున పార్వతీదేవికి పుత్రరూపమున అత్యంత మనోహర బాలక రూపమున ప్రకటితమైన మూర్తియే గణేశు డని పిలవబడుచున్నాడు, అందుచేతనే గణపతి ప్రార్థనయందు శుక్లాం భరధరం విష్ణుం

శశివర్ణం చతుర్భుజం అని విష్ణు స్వరూపుడుగా వైష్ణవులు పూజించుచూ వచ్చిరి, శైవులు పార్వతీ పరమేశ్వరుని తనయునిగా శైవదైవంగా పూజించుచూ వచ్చిరి. ఈ విధంగా శైవ వైష్ణవుల ఇరువురి పూజలను అందుకొనుచూ ఆదిదేవుడుగా గణపతి బుధగ్రహాధిపత్య దేవుడు అయ్యేను.

కేతువు ఈశాన్యదిశాధిపతి వైష్ణవగ్రహం, సర్పగ్రహం, పురుష గ్రహం, వాసుకీ అను సర్పమును పాన్పుగా ధరించిన మహావిష్ణువు కేతు గ్రహాదిపత్య దేవుడు అగును.

గురువుఈశాన్యధిశాధిపతి, వైష్ణవగ్రహం, పురుషగ్రహం, భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు నవగ్రహాల్లో బృహస్పతి నేనే అన్న ప్రవచన రీత్యా గురుగ్రహాధిపత్య దేవుడు గీతాచార్యులు శ్రీకృష్ణుడు అగును.

నవగ్రహ ఆధిపత్య దేవతలకు అతీతమైన శక్తి వేదమాత గాయత్రీ దేవి. అందుచేతనే మన మహర్షులు నగాయత్రాః పరం మంత్రం నమాతుః పరదేవత అన్నవేదోక్తి ద్వారా తల్లికిమించిన దైవంలేదు గాయత్రీ మంత్రమునకు మించిన మంత్రములేదు అని తెలియజేసిరి. ఈ గాయత్రీమంత్రముయొక్క గొప్పతన మును గూర్చి మహర్షులు, వేదాలు, ఉపనిషత్తులు, పురాణ ఇతిహాసాలు ఈవిధంగా తెలుపు చున్నవి.

**1. జ్యోతిశ్శాస్త్ర పితామహులు వృద్ధ పరాశర స్మృతి అ 4-4 నందు ఈవిధంగా వివరించారు.**

సర్వేషాంజపసూక్తానాం ఋచశ్చ యజుషాంతథా
నామ్నాం చైక్షరాదీనాం గాయత్రీ పరమోజపః

సమస్త జపసూక్తములందును, ఋగ్యజుస్సామ వేదములందును అదేవిధంగా ఏకాక్షరాది మంత్రములందును గాయత్రీ మంత్రజపము పరమశ్రేష్ఠము.

**2. పరాశర స్మృతి అ. 5-116**

గాయత్రీ చైవవేదాశ్చ బ్రహ్మాదాతోలితాపురం
వేదోభ్యశ్చ చతుర్భ్యో గాయత్ర గరీయసీ.

ప్రాచీన కాలంలో బ్రహ్మగాయిత్రిని వేదములతో తూయగా నాలుగు వేదములు గాయత్రితో తులతూగలేకపోయినవి.

**3. పరాశరులు**

గాయత్రీ జపకృద్భక్త్యా సర్వపాపైః ప్రముచ్యతే।

భక్తితో గాయిత్రీని జపించువాడు సర్వ పాపములనుండి విముక్తు డగును.

**4. వృద్ధ పరాశరం అ. 5-24**

కింవేదైః పఠిస్స సేతిహాస పురాణకైః
సాంగైః సావిత్రీహీనేన నవిప్రత్వవయవాస్యతే

ఇతిహాస, పురాణములను, సకలవేదములను చదివినప్పటికిని బ్రాహ్మణులు గాయత్రీ మంత్రహీనులైన బ్రాహ్మణత్వమును పొంద జాలరు.

**5. వ్యాసుడు**

యధా మధుచపు ష్పేభ్యో ఘృతందుగ్ధాద్ర సాత్పయః
ఏవం హి సర్వవేదానాం గాయిత్రీ సార ఉచ్యతే

ఏవిధమయిన పుష్పముల సారమైన మధువు, పాలనుండి నేయి, రససారమైన పాలు కలుగుతాయో ఆవిధంగా గాయత్రీ మంత్రము సకల వేదముల సారమై యున్నది.

**6. విశ్వామిత్రుడు**

ఆదిత్యచః సమోనాస్తి మంత్రోవేదచతుష్టయో
సర్వవేదాశ్చయజ్ఞాశ్చ దానాని చతపాంపిచ
సమానికలయా ప్రాహుర్మునయోన తదిత్యుచః

గాయత్రీ మంత్రమునకు సమానమైన మంత్రము నాలుగు వేదము లందును లేదు. సంపూర్ణవేద, యజ్ఞ, దానతపములు గాయత్రీయొక్క ఒక్క కళకు కూడా సమానం కావు ఈవిధంగా మునులు చెప్పిరి.

**7. అగ్నిపురాణం**

ఐహికాముష్మికం సర్వం గాయత్రీ జపతో భవేత్

గాయత్రీ జపం చేసే వారికి సమస్తమైన ప్రాపంచిక, పరలౌకిక సుఖాలు కలుగుతాయి.



**8. పద్మపురాణం**

వందే వముపతిష్ఠంతే బ్రాహ్మణాయే జితేంద్రియాః
తేప్రయాతి సూర్యలోక కామన్యుక్తించ పార్థివ

జితేంద్రియుడైన బ్రాహ్మణుడు గాయత్రీ ఉపాసనచేసిన ఓ రాజా! అతడు వశ్యము సూర్యలోకమును పొంది క్రమముగా ముక్తిని పొందును.

**9. మత్స్య పురాణం**

అర్థోయా బ్రహ్మసూత్రాణాంభవతార్థోవి నిర్ణయం గాయత్రీ భాష్య రూపోసౌవేదార్థ పిరబృంహితః

గాయత్రీయొక్క అర్థము బ్రహ్మసూత్రములు గాయత్రీ నిర్ణయమును మహాభారతము, గాయత్రీ అర్థము వేదములందు ఉన్నవి.

**10. కూర్మ పురాణము**

జప్యని పావనీందేమీ గాయత్రీం వేదమాతరం తపసోభావితోదేవ్యా బ్రాహ్మణాం పూతకి ల్భిషః

బ్రాహ్మణులు వేదజనని పవిత్రమైన గాయత్రీ జపము చేయు చుండిన అనేక పాపముల నుండి విముక్తి పొందుదురు.

**11. నారద పురాణము**

తతః బుద్ధిమతాం శ్రేష్ఠ నిత్యం సర్వేషు కర్మసు సహ్యహృతిం సప్రణవాం గాయత్రీం శిరసాహ

జపంతి యోసధాతేషాం నభయం విద్యతేక్వ చిత్ దశకృత్వః ప్రజప్యాసారాత్య హ్నాపికృతం లఘ...

బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా! నిత్య నియమిత కార్యములన్ని చేయుచు, ప్రణవముతో వ్యాహృతులతో గాయత్రీ మంత్రము నెవరు ఎల్లపుడు జపింతురో అతనికి భయము ఉండదు. రాత్రిగాని, పగలుగాని పదిసార్లు జపంచేస్తే చిన్న దోషాలు నివారించబడతాయి.

**12. భవిష్య పురాణం**

సర్వపాపని నశ్యంతి గాయత్రీ జపతోన్నృణామ్

గాయత్రిని జపించువాడు సర్వపాపములనుండి విముక్తుడగును.

**13. మహాభారతం భీష్మ పర్వంలో అ. 14-16**

యేతాంకేద గాయత్రీం పుమాన్ సర్వగుణాన్వితం
తత్వేన భరతశ్రేష్ఠ! సలోకేన ప్రణశ్యతి

హే యుధిష్ఠర! తత్వ పూర్వకమైన సర్వగుణ సంపన్నమై పుణ్య మయమైన గాయత్రీ నెవడు తెలుసుకుంటాడో అతడు ప్రపంచంలో దుఃఖాలను పొందడు.

**14. దేవి భాగవతం స్కం. 12 అ36**

గాయత్ర్యుపాసనానితా సర్వవేదైః సమీరితా
యయావినాత్వధఃపాతో బ్రాహ్మణ్యస్యాస్తి సర్వదా

గాయత్రీని నిత్యము ఉపాసించాలని సమస్త వేదములందు చెప్ప బడింది. ఉపాసించని బ్రాహ్మణులకు అధోగతి తప్పదు.

**15. అధర్వ వేదం 16-17-1**

స్తుతో, మయా, వరదా, వేదమాతా, ప్రభోదయంతీం
పావనీ, ద్విజానం, ఆయుఃప్రాణం, ప్రజాం, ప్రశుం,
కీర్తిం, ద్రవిణం బ్రహ్మవర్చసం

అధర్వవేదంలో స్వయంగా వేద భగవానుని పలుకులు నాచేత స్తుతించబడిన, ద్విజులను పవిత్రులనుచేసే, వేదమాత గాయత్రీ, ఆయువును, ప్రణవమును, శక్తిని, పశువులను, కీర్తిని, ధనాన్ని, బ్రహ్మ తేజస్సును వారికిచ్చుగాక.

**16. మహానారాయణోపనిషత్ 115-1**

గాయత్రీ చందసా మాతేతి

గాయత్రీ వేదములకు మాత అనగా ఆది కారణము.

## పుష్కర నిర్ణయము

## యమునా నదీ పుష్కరాలు

**19-6-2014 నుండి 30-6-2014 వరకు**

**జరుగు యమునా నది పుష్కరాల గురించి**

యమునానదీ ఉత్తరప్రదేశలోని తెహ్రీగఢ్వాల్ ప్రాంతము లోని కాళిందీ పర్వతపు మంచు శిఖరాల్లో ఉద్భవించింది. ఈ నదీమూలం యమునోత్రికి 6 1/2 కిలోమీటర్లపైన ఉన్నది. గంగోత్రిలాగే యమునోత్రి అత్యంత పవిత్రమైన స్థలం, ఇక్కడ స్నానాలు ఆచరించినవారికి సద్గతులు కలుగుతాయని పురాణాలు చెపుతాయి. ఈ యమునోత్రికి వెళ్ళేందుకు మే, జూన్ నెలలు అనుకూలమైనవి. మిగిలిన రోజులు (చలికాలం) మంచుకురుస్తుంది. యమునోత్రి దగ్గర "యమునాదేవికి" చిన్న ఆలయం ఉంది. యమునోత్రినుంచి యమునానది ప్రవహించి శివాలక్ పర్వత శ్రేణులు చీల్చుకుంటూ ఢిల్లీమీదుగా ప్రవహించి బృందావన్, మధుర చేరుతుంది. ఈ స్థలానికి దగ్గరలోనే యమున పాయగాచీలి ఆగ్రామీదుగా ప్రవహించి అలహాబాద్‌లో గల గంగానదిని కలుస్తుంది. అంతర్యాహిని అయన సరస్వతితో కలసి త్రివేణి సంగమంగా మారి వింధ్యపర్వత వరస జలపాత కొండల వరుసులో "చేంబరీ" నది పుట్టి ఇటార్చి నగరం దగ్గర యమునానదిలో కలుస్తుంది. సిమ్లానుంచి పారి పౌంటాసాహేబ్ అనేచోట "గౌరి" అనునది యమునానదిలో కలుస్తుంది. యుజాఫల్ నగర్‌వద్ద "సాహిబ" అను మరొక్కనది యమునా నదిలోకలుస్తుంది. ఇంకా సింద్, చెట్వా, దసన్, కైన్ అను నదులు యమునలో కలుస్తాయి. ఈ విధంగా అనేక ఉపనదులు కలుపుకొని కొన్నివేల వ్యవసాయ క్షేత్రాలకు నీరందిస్తూ భారతావనికి అతిపూజ్యమైన నదిగా కీర్తించబడి, మధుర, బృందావనం లాంటి పుణ్యక్షేత్రాల మీదుగా ప్రయాణించి జనులందరిని పుణ్యదనులుగా చేసినది గంగానదికి ఉపనదిగా అయినది.

ఋగ్వేదంలో కూడా యమునానది ప్రస్తావన కనిపిస్తుంది. ఇందులో యమున యముడి సోదరిగా చెప్పబడుతుంది. శ్రీరాముడు వనవాస సమయములో గంగా యమున సంగమాన్నిచూసినట్లు రామాయణంలో చెప్పబడింది గంగా యమునల సంగమం ఎంతో పవిత్రమైంది. ఈ సంగమంలో వేదాలు అధ్యయనం చేయబడ్డాయి. యజ్ఞాలు అనుష్టింపబడ్డాయి. 60 కోట్ల పుణ్యతీర్థాలు ఈ సంగమంలో కలిసి ఉంటాయి. ఈ సంగమస్నానంవల్ల రాజసూయాది యాగఫలం. చతుర్వేద పఠనఫలం పొందుతారని భారతంలో చెప్పబడింది. ఉత్తర రామాయణంలో కూడా యమునానది ఆవిర్భావం గూర్చి చెప్పబడింది. విశ్వకర్మ కూతురైన సంజ్ఞ సూర్యునిభార్య ఆమె సూర్యునితేజస్సు సహించలేక కళ్ళు మూసుకోవడంవల్ల సూర్యుడు ఆగ్రహించి నీకు నిఖిల జనైక సంయమ సుతుడు పుడతాడని చెప్తాడు. ఫలితంగా యముడు జన్మిస్తాడు. తరువాత ఆమె సూర్యుణ్ణి సమీపించినపుడు చంచల దృష్టితో చూడగా సూర్యుడు కోపించి నీకు విలోలయైన కూతురు కలుగుతుందని చెప్తాడు. తత్ఫలితంగా చంచలమైన యమున (నది) పుడుతుంది. వేద వ్యాసుడు మాంధాత మొదలగువారు యమునానది తీరప్రాంతాల్లోనే జన్మించారు.

బలరాముడొకసారి బంధుసమేతంగా యమునా స్నానానికి వెళ్ళి యమునను పిలువగా ఆమె బదులివ్వదు. అందుకు బలరాముడు కోపించి నీవురానిచో నిన్ను చీల్చగలనని తన హలాయుధాన్ని అందులోకి చొప్పిస్తాడు అందుకు భీతిల్లిన యమున స్త్రీ రూపానవచ్చి బలరామునికి అమూల్యరత్నాలిచ్చి వెళ్తుంది. హలమును యమునానది జలాల్లో దించడంవల్ల అప్పటినుండి యమునానది జలం తెల్లగ అయిందని చెప్పబడింది. భాగవతంలో కూడా యమునానది సూర్యుని కుమార్తెగానే చెప్పబడింది. నదీ రూపిణి అయిన యమున శ్రీకృష్ణుదులతో సన్నిహిత సంబంధం కలిగికనిపిస్తుంది. బాలకృష్ణుని వ్రేపల్లెకు తీసుకువెళ్ళేటప్పుడు యమునానది రెండు పాయలుగా చీలి వసుదేవుని దారిని సుగమంచేసి భగవత్కార్యానికి సహాయం చేసింది. ఇక బాలకృష్ణుని బాల్యమంతా కన్నులారా తిలకించిన ధన్యయమున.

యమునా నదికి సంబంధించిన ఒక పర్వదినం కూడా వుంది. దానికే భాతృద్వితీయ లేక యమద్వితీయ అని పేరు. అన్నా చెల్లెళ్ళ బంధాన్ని పటిష్టంచేసే ఈ పండుగ కార్తీక శుక్ల విదియనాడు (దీపావళి పండుగ అయిన తరువాత రెండవ రోజు) జరుపుకుంటారు. భూలోకంలో నదీరూపంలో ఉన్న తన చెల్లెలు యముననుచూడడానికి యమధర్మరాజు ప్రతిఏటా వస్తాడనీ, యమునాదేవి తన అన్నను ఆదరంతో సత్కరించి భోజనం పెడుతుందనీ కథనం. యమునా నదిపరంగా ఈ పండుగకు యమద్వితీయ అనీయముని పరంగా భాత్ర ద్వితీయ

అనీ పేర్లువచ్చాయని చెబుతారు. చెల్లెలి ఆతిథ్యాన్ని స్వీకరించి, చక్కటి విందారగించి ఆమె ఆప్యాయ అనురాగాలకు సంతోషించిన యముడు ఆమెకు సుమంగళిత్వం ప్రసాదించాడని, అందువల్ల ఈపండుగను ఆచరిస్తే ఆయురారోగ్య సౌభాగ్యాలు కలుగుతాయని నమ్మకం. అందుకే ఈ పండుగ నాడు అన్న చెల్లెలి ఇంట భోజనంచేసి ఆమెకు తనశక్తి కొలది కానుకలిచ్చి సంతోషపరుస్తాడు. చెల్లెలు లేనివారు చెల్లెలి వరుస అయినవారి ఇంటికివెళ్లి పండుగ జరుపుకుంటారు.

## స్నానయోగ్యమైన యమునా నదీతీర పుణ్యక్షేత్రాలు

**యమునోత్రి :**

ఋషికేష్ నుండి యమునోత్రికి ప్రయాణం చేయవచ్చు. ఋషికేష్‌నుండి 22 కి.మీ దూరంలో గంగోత్రికి వ్యతిరేక దిశలో ప్రయాణంచేయాలి. జ్ఞాన మోక్షాదులకు ఈ యమునోత్రి యాత్ర ఉపకరిస్తుంది. యమునోత్రికి చేరుకుని యమునా దేవి దర్శనంతో భక్తులు ఆత్మానంద భూతిని పొందుతారు. ఈ యాత్ర ఎప్రిల్ అక్టోబర్ మాసాల్లో అనుకూలం.

**మధుర :**

ప్రపంచ వింతల్లో ఒక్కటైన తాజ్‌మహల్‌కు 56 కి.మీ. దూరాన శ్రీకృష్ణభగవాన్ జన్మించిన మధురాక్షేత్రం ఉన్నది. ఈ శ్రీకృష్ణుని జన్మభూమిలో దేవకీవసుదేవులు ఉన్న జైలుకూడా ఉన్నది. హైందవులంతా భక్తి శ్రద్ధలతో ఇచ్చట పూజలు చేస్తారు. ఇచ్చట ద్వారకాదీశ మందిరం, గీతా మందిరం, భక్తి ముక్తికి సోపానలు. విజయవాడనుండి మధురకు రైలు మార్గంద్వారా సరాసరి చేరుకోవచ్చు.

**బృందావనం :**

ఈ క్షేత్రం మధురనుంచి 10 కిలోమీటర్లు దూరాన, యమునానదికి తూర్పుదిక్కున ఉంది. ఇచ్చట గోపిజన వల్లభుడు గోపికలతో శృంగార రాసలీలలు జరిపిన ప్రదేశంగా చెప్ప బడింది.

**నోట్ :-** ఉత్తరాంచల్‌లో జరిగిన తుఫాన్ ఉపద్రవం వలన యమునోత్రి సందర్శనం దుర్లభం. మధుర బృందావనంలో ప్రవ హించు యమునానది కలుషితం చే నదీజలాలు స్నానయోగ్యం కాకున్నవి. శుద్ధయమున నదీ అలహాబాద్ దగ్గర త్రివేణి సంగమ ప్రాంతం పుష్కర స్నానమునకు యోగ్యము.



## పరాశర సిద్ధాంతరీత్యా శుభముహూర్త నిర్ణయం

నేటి ముహూర్త విధానంఎన్నో లోపాలతో కూడుకొనివున్నది. ముఖ్యంగ శుభ ముహూర్త నిర్ణయం జన్మ జాతకాను గుణంగా లేక ప్రశ్న జాతకానుగుణంగా వుండాలని పరాశర మహర్షి ప్రవచనం. నేటి ముహూర్త భాగంనందు వివరించిన మీన చైత్రం, మిథునాషాడం, కన్యా భాద్రపదం, ధనుర్ పుష్యమి మొదలగు మాసాలలో శుభకార్యము చేయ రాదని వ్రాశారు. ఇందుకు చేయరాదనే కారణం తెలుపలేదు. అందుకు సరియైన హేతుబద్ధమైన సమాధానం లేకుండుటచే ఈనిర్ణయములు ఆచరణీయములు కాకున్నవి.

నేటిముహూర్త విధానంనందు తిథి ప్రాధాన్యత అధికమైనది. చవితి, షష్టి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య తిథుల యందు శుభకార్యములు చేయరాదని నేటి సాంప్రదాయ జ్యోతి ష్యులు తెలుపు తున్నారు. తిథి అనగా చాంద్రమాన తేది చైత్ర, వైశాఖాది తెలుగు నెలలు లెక్కించేందుకు ఉపయోగించే తెలుగు తేది మాత్రమే. పై అశుభ తిథితులయందే మహాత్ములు, దేవతలు జన్మించారు. చవితి రోజు వినాయకుడు, షష్టిరోజు సుబ్రహ్మణ్యస్వామి అష్టమిరోజు శ్రీకృష్ణుడు,నవమిరోజు శ్రీరామ చంద్రుడు జన్మించారు. చతుర్థశిరోజు లోకకంఠకుడైన నరకాసురుని, సత్య భామ సంహరించెను. తిథికి దుష్ఫలము ఇచ్చే శక్తివున్న చెడ్డ తిథులన్న పై తిథులయందు మహాత్ములు ఎట్లు జన్మిస్తారు. లోకకంఠక సంహారం ఎలా జరుగుతుంది? పై సూచనల మేరకు ముహూర్తభాగమునందు తిథిప్రాధాన్యతలేదని, తిథిఅనగా చాంద్రమాన మాసాలు లెక్కించే తెలుగు తేదిఅని, తిథికీదుష్ఫలముఇచ్చే శక్తిలేదని ఆరోజు తారబల, చంద్రబల భావశుద్ధినిబట్టి ఫలం జరుగునని సాంప్రదాయ జ్యోతిషశాస్త్ర వేత్తలు గుర్తించాలి.

నేటిసాంప్రదాయ జ్యోతిషులు సుముహూర్తమునకు మంగళ, శనివారములు నిషేధిస్తున్నారు. తారబల,చంద్రబల, భావశుద్ధి కలిగిన ముహూర్తమయినపుడు, గురువర్గ లగ్నములకు మంగళవారం శుభప్రదమే, కారణం మంగళవారమునకు అధిపతి అయిన అంగారకుడు గురువర్గంనకు ఆధిపత్య శుభుడే. తారబల, చంద్రబల భావశుద్ధి కలిగిన ముహూర్తంనకు శనివర్గులకు శనివారం శుభప్రదమే కారణం శనివారమునకు అధిపతి అయినశని, శని వర్గులకు ఆధిపత్య శుభుడే. ఇక సాంప్రదాయ పద్ధతిలోచోటుచేసుకున్న పంచకము,తారబల,చంద్రబలముయొక్కనిర్ణయం లోపభూయిష్టమైనది.

<u>పంచకము :</u> పంచకము అనగా ముహూర్తకాల తిథి, వార నక్షత్ర లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగావచ్చు శేషం 1.మృత్యుపంచకము 2. అగ్నిపంచకం 3. రాజదండన పంచకం 6.చోరపంచకం 8. రోగ పంచకమని అశుభ పంచకములను గూర్చి తెలుపు తున్నారు. కొన్ని ప్రాంతముల యందు తిథి వార నక్షత్ర లగ్నసంఖ్యలకు ధృవకసంఖ్యలను కలిపి 9చే భాగించగావచ్చు శేషమునుబట్టి ఫలనిర్ణయం చేయుచున్నారు. నవగ్రహము లకు శుభ, అశుభఫలములు ఇచ్చుశక్తి కలదుగాని తిథి వార నక్షత్ర లగ్నముల ద్వారా భాగించగా వచ్చిన మొత్తమునకు అశుభ ఫలం ఇచ్చుశక్తిలేదని ఈ పంచకములు గూర్చి జ్యోతిషశాస్త్ర పితామహులయిన పరాశరమహర్షి, పరశర హోరాశాస్త్రమందు గాని పూర్వపరాశరీ గ్రంథం నందుగాని వివరించలేదు.

**పూర్వ పద్ధతి రీత్యా తారాబలం :** మన జన్మనక్షత్రం నుండి నిత్య నక్షత్రం వరకు లెక్కించి ఆ మొత్తాన్ని 9చే భాగించగా మిగిలిన శేషమునుబట్టి 1 శేషం మిగిలిన జన్మతార 2 శేషం మిగిలిన సంపత్తర 3 శేషం మిగిలిన విపత్తార 4 శేషం మిగిలిన క్షేమతార, 5 శేషం మిగిలిన ప్రత్యక్తార, 6 శేషంమిగిలిన సాధనతార, 7 శేషం మిగిలిన నైధనతార, 8 శేషం మిగిలిన మిత్రతార, 9 శేషం మిగిలిన పరమమిత్రతార అగునని తెలిపారు.

**పూర్వ పద్ధతి రీత్యా చంద్రబలం :** జన్మరాశి నుంచి గోచారరీత్యా చంద్రుడున్న రాశి 1-3-6- 7-10-11 రాశులలో వున్న శుభఫలమిచ్చునని, శుక్లపక్షమున జన్మ రాశినుండి గోచారరీత్యా చంద్రుడున్న రాశి 2-5-9 స్థానములలో వున్నపుడు, కృష్ణ పక్షంలో జన్మరాశినుండి గోచారరీత్యా చంద్రుడున్నరాశి,4-8- 12 స్థానములలో చంద్రుడు శుభఫల మిచ్చునని తెలిపారు. సాంప్రదాయరీత్యా తారబల, చంద్రబలాలు శాస్త్రీయంగాలేవని పరాశర సిద్ధాంతరీత్యా నూతన పరిశోధనరీత్యాతారబల, చంద్ర బలాలు ముందు వివరించుచున్నాను.

తారబల, చంద్రబలాలనగా ఆయాభావ శుభఫలాలు శుభ గ్రహము లిచ్చు ఫలితాలు ఏ దినం జరుగునో తెలిసుకొను విధానం అని అర్ధం. ఈ విధానమునుగూర్చి, ముందు ముందు వివరించుచున్నాను. ఈ ద్వాదశ రాశిచక్రం వలనే అష్టదిక్చక్ర కాలమాన నిర్ణయాధిపతి అయిన కాలస్వరూపుడు సూర్యభగ వానుడు మొదటిది అగు అక్షాంశ మార్గంలో ద్వాదశరాశి చక్రమును ఒక్కొక్కరాశిని ఒక్కొక్క నెలలో సంచరించును.

సూర్యుడు సంచరించుచున్న ఏకమార్గమగు అష్టదిక్చక్రంలో ఒక్కొక్క దిక్కును 3 గం॥ చొప్పున 8దిక్కులను 24 గం॥లలో పరిభ్రమించుచున్నాడు. సూర్యోదయం 6గం॥నుండి సూర్యాస్తమయం 6గం॥ అగుదినం (పగలు రాత్రిసమానమయిన దినం) 8దిక్కులను ఆరోహణక్రమంలో ఒకదిశకు 3గం॥చొప్పున పరిభ్రమించుచున్నారు.

తెల్లవారుజామున 4-30 ని॥లకు తూర్పుదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి ఉదయం 6గం॥లకు తూర్పుదిశా మధ్యబిందువునకు చేరుచున్నాడు. తూర్పుదిశా మధ్య బిందువు నుండి ఉదయం 7గం॥ 30ని॥ల వరకు అవరోహణ క్రమంలో అంత్య బిందువును చేరుచున్నాడు.

ఉదయం 7గం॥30ని॥లకు ఆగ్నేయ దిశాప్రారంభ బిందు వులో ఆరోహించి ఉదయం 9 గం॥లకు ఆగ్నేయదిశమధ్య బిందువును చేరుచున్నాడు. ఆగ్నేయ దిశామధ్య బిందువు నుండి ఉదయం 10గం॥ 30 ని॥ల వరకు అవరోహణక్రమంలో అంత్య బిందువును చేరుచున్నాడు.

ఉదయం 10గం॥ 30 ని॥లకు దక్షిణదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి మధ్యాహ్నం 12 గం॥లకు దక్షిణదిశా మధ్యబిందువునకు చేరుకున్నాడు. దక్షిణదిశా మధ్యబిందువునుండి మధ్యాహ్నం 1గం॥ 30ని॥లకు వరకు అవరోహణ క్రమంలో అంత్యబిందువును చేరుచున్నాడు.

మధ్యాహ్నం 1గం॥30 ని॥లకు నైఋతి దిశాప్రారంభ బిందు వులో ఆరోహించి మధ్యాహ్నం 3 గం॥లకు నైఋతి దిశామధ్య బిందువునకు చేరుచున్నాడు. నైఋతి దిశామధ్య బిందువు నుండి సాయంత్రం 4గం॥ 30 ని॥ల వరకు అవరోహణ క్రమంలో అంత్యబిందువును చేరుచున్నాడు. సాయంత్రం 4-30ని॥లకు పశ్చిమదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి సాయంత్రం 6గం॥లకు పశ్చిమదిశా మధ్యబిందువునకు చేరుచున్నాడు. పశ్చిమదిశా మధ్యబిందువునుండి రాత్రి 7-30 ని॥లకు వరకు అవరోహణ క్రమములో అంత్య బిందువును చేరుచున్నాడు. రాత్రి 7-30ని॥లకు వాయువ్యదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి రాత్రి 9గం॥ వాయువ్యదిశా మధ్యబిందువునకు చేరుచున్నాడు. వాయువ్యదిశా మధ్యబిందువునుండి రాత్రి 10-30 ని॥ల వరకు అవరోహణ క్రమంలో చేరుచున్నాడు.

రాత్రి 10-30ని॥లకు ఉత్తరదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి రాత్రి 12 గం॥లకు ఉత్తర దిశామధ్య బిందువుకు చేరుచున్నాడు. ఉత్తరదిశా మధ్యబిందువు నుండి రాత్రి 1గం॥30 ని॥ల వరకు అవరోహణ క్రమంలో అంత్యబిందువును చేరుచున్నాడు.

రాత్రి 1-30ని॥లకు ఈశాన్యదిశాప్రారంభ బిందువులో ఆరోహించి తెల్లవారు జామున 3గం॥లకు ఈశాన్యదిశా మధ్యబిందువునకు చేరుచున్నాడు. ఈశాన్య దిశామధ్య బిందువు నుండి తె.జామున 4 గం.30ని. వరకు అవరోహణ క్రమంలో అంత్య బిందువును చేరుచున్నాడు.

తూర్పుదిశాధిపతి రవి, ఆగ్నేయ దిశాధిపతి శుక్రుడు, దక్షిణ దిశాధికుజుడు, నైఋతి దిశాధిపతి రాహువు, పశ్చిమ దిశాధి పతి శని వాయువ్య దిశాధిపతి చంద్రుడు, ఉత్తర దిశాధిపతి బుధుడు ఈశాన్యదిశాధిపతి గురుకేతువులు అగుదురు.

దిశాధిపతి లగ్నాధిపతి ఒకేవర్గ గ్రహం అయిన ఆ ముహూర్తం శుభముహూర్తంగా స్వీకరించాలి. దిశాధిపతి లగ్నాధిపతి విభిన్న వర్గంవారు అయిన ఆ ముహూర్తాన్ని అశుభముహూర్తంగా గమ నించాలి. ఈవిధంగా దిశాధిపతులు, లగ్నాధిపతులు ఒకే వర్గజులగుట కాలచక్రమునకు త్రికోణరాశులయిన మేష, సింహ, ధనుర్ సౌరమాస ములలో మాత్రమే ప్రాప్తించును. మిగిలిన మాసములందు స్వల్పంగా ప్రాప్తించు చుండును.

**సుముహూర్త కాలములో పాటించవలసిన ముఖ్యవిధులు :**

సుముహూర్త నిర్ణయము చేయునపుడు గురువర్గ లగ్నములో జన్మించిన వారికి గురువర్గ సుముహూర్త లగ్నములందే సర్వశుభకార్యములు నిర్వహించుటకు శుభముహూర్తం నిర్ణయం చేయాలి. అట్లే శనివర్గం నందు జన్మించిన వారికి శనివర్గ శుభముహూర్తంనందే సర్వశుభకార్య ములు నిర్వహించుటకు శుభముహూర్త నిర్ణయం చేయాలి. వ్యతిరేక వర్గలగ్నములందు ముహూర్తనిర్ణయం చేయరాదు. జన్మలగ్నం తెలియని వారు దైవజ్ఞునివద్దకు ప్రశ్నించుటకై వచ్చిన లగ్నానుసారం వారు ఏలగ్నం నందు శుభకార్య నిమిత్తమై అడుగుచున్నారో తెలుసుకొని అదే వర్గ 6 లగ్నాలందే వారు అడుగు శుభకార్యలగ్నం నిర్ణయించాలి. వివాహశుభముహూర్తం చేయునపుడు వధూవరుల ఇరు వురి జన్మలగ్నములు విభిన్నవర్గమునకు చెందినచో వరునియొక్క



జన్మలగ్నం ఏవర్గమునకు చెందియున్నదో అదేవర్గలగ్నమందు (గురువర్గం లేక శనివర్గం) శుభముహూర్త నిర్ణయంచేయాలి. కారణం వధువుయొక్క గోత్రనామముల మార్పుచెంది వివాహా నంతరం వరునిగోత్రనామ సూత్రములను, వరుని ఇష్టదైవ ప్రార్థనాదుల యందు సహధర్మచారిణిగా (భార్యగా) ఆచరించవలసి వున్నది. కావున వరుని ప్రధానంగా (గృహయజ మానిని) సర్వశుభకార్య ములకు పరిగణించవలసి వున్నది.

**ముహూర్త, నిర్ణయ ఆవశ్యకత :**

జాతకములో వివిధ భావములు శుభ అశుభ గ్రహ సమ్మిళి తంగా వుండును గాన శుభముహూర్తం వలన ఆయా శుభకార్యములు ప్రారం భించినపుడు శుభవర్గ శుభలగ్న శుభగ్రహ, శుభ నక్షత్ర పరంగా ఆచరించ దం వలన ఆ జాతకుని జీవితంలో ఆ కార్య భావ సంబంధ పాపగ్రహ ములు ఇచ్చు దుష్ఫలితములు తక్కువగాను శుభగ్రహములు ఇచ్చు ఫలములు విశేషంగాను ఆయా భావసంబంధ భావఫలాలు ఆయా జాతకు నకు అనుభ వించగలడు అని మహర్షుల నిర్ణయమై వున్నది. తద్ వ్యతిరేకంగా వ్యవహరించడం వలన దుష్ఫలాలు అధికంగా శుభఫలాలు తక్కు వగా అనుభవించవలసి వచ్చును. కార్యచరణ కాలశుభముహూర్తం నకు అట్టి మహత్తు కలదు. శుభముహూర్త నిర్ణయంనకు 1. తారాబలం 2. సూర్యబలం 3. చంద్రబలం పరిశీలించు విధి విధానమునుగూర్చి వివరించుచున్నాను.

**తారాబల నిర్ణయవిధి :**

పైవివరించిన సూత్రానుసారంగా ఆయాసం॥లలో శుభమాసమును, శుభముహూర్త లగ్నమును ఎన్నుకొనిన తర్వాత, శుభ ముహూర్త లగ్నాత్ మనము ప్రారంభించవలసిన శుభకార్యము ఏయేభావములకు సంబం ధించినదో ముందుగా తెలుసుకోవాలి. ముహూర్త లగ్నాత్ ఆభావత్రయంతో సంబంధంగల స్థిరశుభు లయిన 1-5-9 స్థానాధిపతులు నిర్ణయించాలి. ఆతర్వాత శుభముహూర్త దినసక్షత్రాధిపతిపై శుభగ్రహాలకు సంబం ధించిగాని లేక పైశుభగ్రహ స్వక్షేత్రాలతో స్థితిపొంది వుండాలి. అట్టిదినమునాడు ఆ కార్యక్రమం ఆ శుభ ముహూర్తమునకు తారబలం కలదని తెలియును.

**సూర్యబలం :**

దిన నక్షత్రాధిపతి ఏ శుభగ్రహత్రయమునకు సంబంధించి వున్నాడో అదే త్రయంతో సూర్యుడు కూడ $15^{o}$ల కన్నా అధిక డిగ్రీలు సంబంధం కలిగి వుండాలి. అట్లు రవి స్థితియుతి వీక్షణతో సంబంధించివున్న ఆ ముహూర్తమునకు కర్మసాక్షి అగు రవియొక్క మొదటి సాక్ష్యం కలదని తెలియును.

**చంద్ర బలం :**

దినసక్షత్రాధిపతి ఏ శుభగ్రహనక్షత్రమునకు సంబంధించి వున్నాడో అదే శుభగ్రహ త్రయంతో చంద్రుడు తన స్థితియుతి వీక్షణలతో సంబంధించి వున్నచో ఆ ముహూర్తము నకు చంద్రుని యొక్క రెండవ సాక్ష్యం కూడ కలదని తెలియును.

గమనిక : శుభగ్రహత్రయం అనగా శుభగ్రహంతోగాని, ఆ శుభగ్రహం యొక్క రెండు స్వక్షేత్రములతోగాని గ్రహమునకు సంబంధం కలిగివుండుట.

ముఖ్యగమనిక : పై మూడింటిలో మొదటి తారాబాలం దస్తా వేజుకు బిక్కిలంతో సమానం, తర్వాత దస్తావేజుకు సాక్షుల వలె ముహూర్తమునకు రవిచంద్రులు ఇరువులు గాని లేక ఏ ఒక్కరైన సాక్ష్యం తప్పక వుండాలి. ఒక సాక్ష్యం లేకున్నా దస్తావేజు ఎట్లు చెల్లదో అట్లే శుభకార్యలగ్నం తారబలంతో పాటు రవి చంద్ర బలంతో ఇరువురు లేక ఒక్కరిది తప్పకుండా వుండవలెను. మాసగ్రహమయిన రవిబలం తరచుగా ముహూర్తము నకు ప్రాప్తిం చదు. దిన గ్రహమయిన చంద్రబలం శీఘ్రముగా ముహూర్తము నకు ప్రాప్తించు చుండును. అందువలనే మన పూర్వులు ముహు ర్తంనకు తారబల, చంద్ర బలాలు అవసరమని వ్రాసివున్నారు. శుభముహూర్త లగ్నమునకు స్వవర్గలగ్న, తారబల, చంద్ర బలము, రవిబలం పాటించక ఇష్టానుసారం వారివారి వీలును బట్టి కార్యా రంభము చేసినచో ఆ కార్యము శుభఫలం జాతకంలో ఎన్నిరెట్లు అనుభవించవలసి వున్నదో అన్నిరెట్లు సంపూర్ణంగా అనుభవించలేము.

ఈ విధముగా పరిశీలించి వివాహ గృహారంభ, గృహప్రవేశ విద్యా రంభ నూతన వ్యాపార ప్రారంభ దేవాలయ ప్రతిష్టలు, జరుప వచ్చునని మనవి చేయుచున్నాను.

"సర్వం విష్ణుం మయం" అను వేదోక్తి ప్రకారం, ఏ మతమో తెలియకపోతే విష్ణు మతాన్ని స్వీకరించు అను పెద్దల ప్రవచనానుసారం సర్వులకు ఉపయుక్తమైన విష్ణు సంబంధమైన ముహూర్తము లను మాత్రమే ఇచ్చుచున్నాను. శైవ జాతకులు కూడా ఈ విష్ణు సంబంధ ముహూర్తములు స్వీకరించిన శుభమే కలుగును.

-xxxx-

# లగ్నాంత్యాముల యొక్క సంస్కార పట్టిక

ఈ పంచాంగ నిర్మాణమునందు లగ్నాంతకాలములు ఆంధ్రప్రదేశ్‌లోని మధ్య ప్రాంతమైన రాజమండ్రినగరమునకు నిర్ణయించబడినవి. ఈ సంస్కార పట్టికద్వారా ఏ తేదికయినా లగ్నాంత్యాలకు (+) చిహ్నం వున్న కూడ ( - ) చిహ్నం వున్న తీసివేయగా ఈ క్రింది ఇష్టప్రదేశములకు లగ్నాంత్యాలు భారతకాలమానం (IST) లో వచ్చును.

| మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| + 20 | + 21 | + 21 | + 19 | + 17 | + 15 | + 13 | + 13 | + 13 | + 14 | + 16 | + 19 | అనంతపురం (రాయలసీమ) |
| + 16 | + 17 | + 16 | + 15 | + 13 | + 10 | + 08 | + 08 | + 08 | + 09 | + 12 | + 14 | కడప (రాయలసీమ) |
| + 17 | + 17 | + 17 | + 16 | + 16 | + 15 | + 13 | + 13 | + 13 | + 14 | + 15 | + 16 | కర్నూలు (రాయలసీమ) |
| + 17 | + 18 | + 17 | + 15 | + 12 | + 08 | + 05 | + 04 | + 04 | + 07 | + 10 | + 14 | చిత్తూరు (రాయలసీమ) |
| + 11 | + 12 | + 12 | + 10 | + 08 | + 06 | + 04 | + 03 | + 03 | + 04 | + 07 | + 09 | నెల్లూరు (దక్షిణకోస్తా) |
| + 10 | + 10 | + 10 | + 09 | + 08 | + 06 | + 05 | + 05 | + 04 | + 05 | + 07 | + 09 | ప్రకాశం (ఒంగోలు)(దక్షిణకోస్తా) |
| + 07 | + 07 | + 07 | + 06 | + 06 | + 05 | + 04 | + 05 | + 04 | + 05 | + 06 | + 06 | గుంటూరు&విజయవాడ(దక్షిణకోస్తా) |
| + 04 | + 04 | + 04 | + 03 | + 03 | + 02 | + 01 | + 01 | + 01 | + 01 | + 03 | + 03 | మచిలీపట్నం (కృష్ణా) (దక్షిణకోస్తా) |
| - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | - 02 | తూర్పుగోదావరి (కాకినాడ)(ఉత్తరఈశాన్యకోస్తా) |
| + 03 | + 03 | + 03 | + 03 | + 03 | + 03 | + 02 | + 03 | + 02 | + 02 | + 03 | + 03 | ప.గోదావరి (ఏలూరు) (ఉత్తరఈశాన్యకోస్తా) |
| - 07 | - 08 | - 07 | - 07 | - 06 | - 05 | - 05 | - 05 | - 05 | - 06 | - 06 | - 06 | విశాఖపట్నం (ఉత్తరఈశాన్యకోస్తా) |
| - 08 | - 09 | - 08 | - 08 | - 06 | - 05 | - 05 | - 04 | - 05 | - 05 | - 06 | - 07 | విజయనగరం (ఉత్తరఈశాన్యకోస్తా) |
| - 10 | - 11 | - 11 | - 10 | - 09 | - 07 | - 07 | - 06 | - 07 | - 08 | - 08 | - 09 | శ్రీకాకుళం (ఉత్తరఈశాన్యకోస్తా) |
| + 13 | + 13 | + 13 | + 13 | + 14 | + 14 | + 14 | + 15 | + 14 | + 14 | + 14 | + 14 | హైదరాబాద్&రంగారెడ్డి(పశ్చిమతెలంగాణ) |
| + 16 | + 16 | + 16 | + 16 | + 16 | + 16 | + 15 | + 15 | + 15 | + 15 | + 16 | + 16 | మహబూబ్‌నగర్ (పశ్చిమతెలంగాణ) |
| + 11 | + 10 | + 10 | + 10 | + 11 | + 11 | + 10 | + 11 | + 10 | + 10 | + 11 | + 11 | నల్గొండ (పశ్చిమతెలంగాణ) |
| + 13 | + 12 | + 13 | + 13 | + 14 | + 15 | + 16 | + 17 | + 16 | + 15 | + 15 | + 14 | మెదక్ (పశ్చిమతెలంగాణ) |
| + 13 | + 12 | + 12 | + 13 | + 15 | + 16 | + 17 | + 18 | + 18 | + 16 | + 15 | + 14 | నిజామాబాద్ (పశ్చిమతెలంగాణ) |
| + 10 | + 08 | + 09 | + 10 | + 13 | + 15 | + 17 | + 19 | + 18 | + 16 | + 14 | + 12 | ఆదిలాబాద్ (ఉత్తర తెలంగాణ) |
| + 09 | + 08 | + 09 | + 09 | + 11 | + 12 | + 13 | + 14 | + 13 | + 12 | + 11 | + 10 | కరీంనగర్ (ఉత్తర తెలంగాణ) |
| + 08 | + 07 | + 07 | + 08 | + 09 | + 10 | + 10 | + 11 | + 11 | + 10 | + 09 | + 09 | వరంగల్ (ఉత్తర తెలంగాణ) |
| + 06 | + 06 | + 06 | + 06 | + 07 | + 07 | + 07 | + 07 | + 07 | + 06 | + 07 | + 07 | ఖమ్మం (ఉత్తర తెలంగాణ) |
| + 00 | - 06 | - 03 | + 05 | + 16 | + 28 | + 37 | + 43 | + 40 | + 31 | + 21 | + 10 | ఢిల్లీ (Delhi) |
| + 33 | + 32 | + 33 | + 34 | + 36 | + 38 | + 39 | + 40 | + 39 | + 38 | + 36 | + 35 | ముంబాయి (Mumbai) |
| + 12 | + 13 | + 13 | + 10 | + 07 | + 04 | + 00 | - 01 | - 01 | + 02 | + 06 | + 09 | చెన్నై (Chennai) |
| - 34 | - 37 | - 36 | - 32 | - 27 | - 22 | - 18 | - 15 | - 16 | - 20 | - 25 | - 30 | కోల్‌కత్తా (Kolkatta) |

# లగ్నాంత్యముల యొక్క సంస్కార పట్టిక

ఈ పంచాంగ నిర్మాణమునందు లగ్నాంతకాలములు ఆంధ్రప్రదేశ్‌లోని మధ్య ప్రాంతమైన రాజమండ్రినగరమునకు నిర్ణయించబడినవి. ఈ సంస్కార పట్టిక ద్వారా ఏ తేదికయినా లగ్నాంత్యాలకు (+) చిహ్నం వున్న కూడ ( - ) చిహ్నం వున్న తీసివేయగా ఈ క్రింది ఇష్టప్రదేశములకు లగ్నాంత్యాలు భారతకాలమానం (IST) లో వచ్చును.

| మేషం | వృషభం | మిథునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| + 23 | + 24 | + 24 | + 21 | + 18 | + 14 | + 11 | + 10 | + 10 | + 13 | + 16 | + 20 | బెంగుళూరు |
| + 28 | + 29 | + 29 | + 26 | + 22 | + 18 | + 14 | + 12 | + 13 | + 16 | + 20 | + 24 | మైసూరు |
| + 26 | + 28 | + 27 | + 24 | + 21 | + 17 | + 13 | + 12 | + 12 | + 15 | + 19 | + 23 | మాండ్య |
| + 26 | + 27 | + 26 | + 25 | + 22 | + 20 | + 18 | + 17 | + 17 | + 18 | + 21 | + 24 | చిత్రదుర్గం |
| + 21 | + 22 | + 21 | + 19 | + 16 | + 12 | + 09 | + 08 | + 08 | + 10 | + 14 | + 18 | కోలార్ |
| + 25 | + 26 | + 25 | + 23 | + 20 | + 17 | + 14 | + 12 | + 13 | + 15 | + 18 | + 22 | టుంకూరు |
| + 20 | + 19 | + 19 | + 20 | + 20 | + 20 | + 20 | + 21 | + 20 | + 20 | + 20 | + 20 | గుల్బర్గా |
| + 30 | + 31 | + 30 | + 28 | + 26 | + 23 | + 21 | + 20 | + 20 | + 22 | + 25 | + 28 | షిమోగే |
| + 27 | + 27 | + 27 | + 26 | + 25 | + 24 | + 22 | + 22 | + 22 | + 23 | + 24 | + 26 | గదగ్ |
| + 29 | + 30 | + 29 | + 28 | + 26 | + 24 | + 22 | + 22 | + 22 | + 23 | + 25 | + 27 | హావేరి |
| + 25 | + 26 | + 26 | + 24 | + 23 | + 22 | + 20 | + 20 | + 20 | + 21 | + 23 | + 24 | కొప్పల్ |
| + 27 | + 29 | + 28 | + 25 | + 21 | + 16 | + 12 | + 11 | + 11 | + 14 | + 19 | + 24 | ఛామ్‌రాజ్‌నగర్ |
| + 34 | + 35 | + 34 | + 32 | + 29 | + 26 | + 23 | + 22 | + 22 | + 24 | + 28 | + 31 | ఉడిపి |
| + 30 | + 31 | + 30 | + 28 | + 25 | + 22 | + 19 | + 18 | + 18 | + 20 | + 24 | + 27 | చిక్ మంగుళూరు |
| + 23 | + 23 | + 23 | + 22 | + 20 | + 19 | + 17 | + 17 | + 16 | + 17 | + 20 | + 21 | బళ్ళారి |
| + 34 | + 35 | + 34 | + 33 | + 31 | + 29 | + 27 | + 27 | + 27 | + 28 | + 30 | + 33 | కార్‌పార్ |
| + 34 | + 35 | + 35 | + 32 | + 29 | + 25 | + 22 | + 21 | + 21 | + 23 | + 27 | + 31 | మంగుళూరు |
| + 29 | + 30 | + 30 | + 27 | + 24 | + 21 | + 17 | + 16 | + 16 | + 19 | + 23 | + 26 | హాసన్ |
| + 29 | + 30 | + 30 | + 28 | + 26 | + 24 | + 22 | + 21 | + 21 | + 23 | + 25 | + 28 | కొడగు |
| + 30 | + 30 | + 30 | + 29 | + 28 | + 26 | + 25 | + 24 | + 24 | + 25 | + 27 | + 28 | ధార్‌వాడ |
| + 16 | + 15 | + 15 | + 16 | + 17 | + 18 | + 18 | + 19 | + 18 | + 18 | + 17 | + 17 | బీదర్ |
| + 19 | + 19 | + 19 | + 19 | + 18 | + 18 | + 17 | + 17 | + 16 | + 17 | + 18 | + 19 | రాయచూర్ |
| + 25 | + 25 | + 25 | + 25 | + 25 | + 25 | + 24 | + 24 | + 24 | + 24 | + 25 | + 25 | బిజాపూర్ |
| + 31 | + 31 | + 31 | + 30 | + 29 | + 28 | + 27 | + 27 | + 27 | + 27 | + 29 | + 30 | బెలాం |
| + 28 | + 28 | + 28 | + 26 | + 25 | + 22 | + 20 | + 19 | + 19 | + 21 | + 24 | + 26 | దావణగెరె |
| + 26 | + 26 | + 26 | + 25 | + 25 | + 24 | + 23 | + 23 | + 23 | + 23 | + 24 | + 25 | బాగలకోటె |

## నవగ్రహ శాంతి విధానము

(శుభరత్న, దిశా, రంగు, సంఖ్య, డాలర్, శుభగ్రహ బలము పెరుగుటకు దేవతోపాసన)

### (మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుర్, మీన లగ్నములైన గురువర్గ జాతకులకు)

1. శుభరత్నాలు : కనకపుష్యరాగం, పగడం, ముత్యం, కెంపు, చూపుడు వ్రేలుకు లేక ఉంగరపు వ్రేలుకు ఉంగరంగా ధరించాలి.
2. శుభరంగులు : పసుపు, తెలుపు, ఎరుపు, గోధుమరంగు దుస్తులు ధరించాలి.
3. శుభ సంఖ్యలు : 1, 3, 6, 8, 9
4. శుభదిక్కులు : (నివాస,వ్యాపారములకు) తూర్పు, దక్షిణము
5. శుభడాలర్ : మేష, వృశ్చికలగ్నజులకు హనుమాన్ డాలర్, కర్కాటక లగ్నజులకు లక్ష్మీ డాలర్, సింహలగ్నజులకు శ్రీరామ లేదా వెంకటేశ్వర డాలర్, ధనుర్, మీనలగ్నజులకు శ్రీకృష్ణునిడాలర్ ధరించాలి.
6. శుభగ్రహబలము పెరుగుటకు : శ్రీకృష్ణ,మహాలక్ష్మీ,హనుమాన్, శ్రీరామ,శ్రీరంగనాయక స్వామి.
7. శాంతి చేసుకోవలసిన పాపగ్రహాలు : శని, శుక్ర, బుధ, రాహువు
8. అనారోగ్యము కలిగినప్పుడు భుజించవలసిన ధాన్యము : పరిగడుపున మొలకలు వచ్చిన కందులు లేదా శనగలు
9. శుభమాసాలు : డిసెంబర్, మార్చి, జూన్, సెప్టెంబర్

**శని గ్రహ శాంతి విధానము :** పుష్యమి నక్షత్రము రోజున లేదా శనివారమురోజు సాయంత్రము 4.30 ని॥ల నుండి 6.00 గం॥ లోపు నువ్వులు, బెల్లముదంచి నువ్వులపిండిచేసి జాతకుడు తూర్పుదిశాభిముఖంగా కూర్చుని నువ్వులపిండిని ఐదుసార్లు దిగ దీయించుకొని, ఆ దిగదీసిన నువ్వులపిండి నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

**బుధ గ్రహ శాంతి విధానము :** జ్యేష్ఠ నక్షత్రము రోజున లేదా బుధవారము రోజు రాత్రి 10.30ని॥ల నుండి 12.00గం॥ లోపు పెసలు గుగ్గుళ్ళుగా చేసి జాతకుడు దక్షిణ దిశాభిముఖంగా కూర్చుని, పెసరగుగ్గుళ్ళు ఏడు సార్లు దిగదీయించుకొని ఆ దిగ దీసిన పెసరగుగ్గుళ్ళు నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

**శుక్రగ్రహ శాంతి విధానము :** భరణి నక్షత్రము రోజున లేదా శుక్రవారము రోజు ఉదయం 7.30నుండి 9.00గం॥లోపు అనుములను గుగ్గుళ్ళుగా చేసి జాతకుడు వాయువ్యదిశాభి ముఖంగా కూర్చుని, అనుము గుగ్గుళ్ళను రెండుసార్లు దిగ దీయించుకొని, ఆదిగదీసిన అనుముగుగ్గుళ్ళను నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

**రాహువు గ్రహ శాంతి విధానము :** పుష్యమి, జ్యేష్ఠా, భరణి నక్షత్రము రోజున లేదా శని, బుధ, శుక్రవారము రోజు సాయంత్రం 4.30ని॥ల నుండి 6.00లోపు ఉద్దులను ఉడికించి ఉద్దిగుగ్గుళ్ళను చేసి జాతకుడు ఈశాన్యం దిశాభిముఖంగాకూర్చుని ఉద్దిగుగ్గుళ్ళను నాలుగుసార్లు దిగదీయించుకొని, ఆ ఉద్దిగుగ్గుళ్ళు నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

## నవగ్రహ శాంతి విధానము

(శుభరత్న, దిశా, రంగు, సంఖ్య, డాలర్, శుభగ్రహ బలము పెరుగుటకు దేవతోపాసన)

(వృషభ, మిథున, కన్య, తుల, మకర, కుంభ లగ్నములైన శని వర్గ జాతకులకు)

1. శుభరత్నాలు : నీలం, పచ్చ, వజ్రం కుడి చేయి మధ్య వ్రేలికి ఉంగరంగా ధరించాలి.
2. శుభరంగులు : నీలం, ఆకుపచ్చ, తెలుపు రంగు దుస్తులు ధరించాలి.
3. శుభ సంఖ్యలు : 2, 4, 5, 7.
4. శుభదిక్కులు : (నివాస,వ్యాపారములకు) ఉత్తర,పశ్చిమము
5. శుభడాలర్ : వృషభ, తుల లగ్నజులకు దుర్గాదేవీ డాలర్, మిథున, కన్య లగ్నజులకు గణపతి డాలర్, మకర,కుంభ లగ్నజులకు శివుని డాలర్ ధరించాలి.
6. శుభగ్రహ బలము పెరుగుటకు : శివ, దుర్గా, గణపతి, సుబ్రహ్మణ్యస్వామి.
7. శాంతి చేసుకోవలసిన పాపగ్రహాలు : రవి, చంద్ర, కుజ, గురు, కేతు.
8. అనారోగ్యము కలిగినప్పుడు భుజించవలసిన ధాన్యము :
   పరగడుపున మొలకలు వచ్చిన పెసలు
9. శుభమాసాలు : జనవరి, ఫిబ్రవరి, జులై, ఆగస్టు.

**రవిగ్రహ శాంతి విధానము:** ఉత్తరాషాడ నక్షత్రము రోజున లేదా ఆదివారము రోజు తెల్లవారుజామున 4.30ని॥ల నుండి 6.00గం॥లోపు గోధుమరవ్వ, బెల్లము కలిపి గోధుమహల్వాగా తయారుచేసి జాతకుడు పశ్చిమ దిశాభిముఖంగా కూర్చుని, గోధుమహల్వాను ఒకసారి దిగదీయించుకొని, ఆ దిగదీసిన గోధుమ హల్వాను ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

**చంద్రగ్రహ శాంతి విధానము:** శ్రవణ నక్షత్రము రోజున లేదా సోమవారమురోజు రాత్రి 7.30ని॥లనుండి 9.00గం.లోపు బియ్యము, పాలు, బెల్లము కలిపి తీపి పొంగలిని తయారుచేసి జాతకుడు ఆగ్నేయ దిశాభిముఖంగా కూర్చుని, తీపి పొంగలిని ఆరుసార్లు దిగదీయించు కొని, ఆ దిగదీసిన తీపిపొంగలిని ఎర్రని లేదా తెల్లనిఆవుకు తినిపించాలి.

**కుజ గ్రహ శాంతి విధానము :** చిత్త నక్షత్రము రోజున లేదా మంగళవారము రోజు ఉదయము 10.30ని॥ల నుండి 12.00 గం॥ లోపు కందులు ఉడికించి కందిగుగ్గుళ్ళు తయారుచేసి జాత కుడు ఉత్తర దిశాభిముఖంగా కూర్చుని, కందిగుగ్గుళ్ళు మూడు సార్లు దిగ దీయించుకొని, ఆ దిగదీసిన కంది గుగ్గుళ్ళు ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

**గురు గ్రహ శాంతి విధానము :** పూర్వాభాద్రా నక్షత్రము రోజున లేదా గురువారము రోజు తెల్లవారుజామున 1.30ని॥ల నుండి 3.00 గం.లోపు శనగలు ఉడికించి శనగ గుగ్గుళ్ళుగాచేసి జాతకుడు నైఋతి దిశాభిముఖంగా కూర్చుని, శనగగుగ్గుళ్ళను తొమ్మిది సార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన శనగగుగ్గుళ్ళను ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

**కేతువు గ్రహ శాంతి విధానము:** ఉత్తరాషాడ, శ్రవణ, చిత్త, పూర్వభాద్ర నక్షత్రములు వచ్చిన రోజున లేదా ఆది, సోమ, మంగళ, గురువారము రోజున తెల్లవారుజామున 1.30ని॥ల నుండి 3.00 గం.లోపు ఉలవలను ఉడికించి ఉలవగుగ్గుళ్ళుగాచేసి జాతకుడు నైఋతి దిశాభిముఖంగా కూర్చుని, ఉలవగుగ్గుళ్లను ఎనిమిదిసార్లు దిగదీయించుకొని ఆ దిగదీసిన ఉలవగుగ్గుళ్ళను ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.





# వాస్తు

## విశ్వకర్మ సిద్ధాంతరీత్యా సప్రమాణ గృహనిర్మాణశాస్త్రం

జ్యోతిషశాస్త్రమను ఒక మహావృక్షంలో వాస్తుశాస్త్రం ఒక శాఖ మాత్రమే జ్యోతిషశాస్త్రం తెలియని వాస్తుశాస్త్రవేత్త పరిపూర్ణుడు కాలేడు. వాస్తుశాస్త్రం యొక్క ప్రశంశ మహాభారత ఘట్టమున ద్వారకానగర నిర్మాణం, రామాయణ ఘట్టమున లంకాపట్టణ నిర్మాణం దేవశిల్పి విశ్వకర్మచే నిర్మించబడినట్టిదిగా తెలుపబడినది. ఈరామాయణ, మహాభారత ఘట్టముల ద్వారా ఈ వాస్తుశాస్త్రం ప్రాచీనమైనదిగా శాస్త్రీయ మైనదిగా గుర్తించవలసివుంది.

వాస్తుశాస్త్రం భూలోకమునకు అందించిన 18మంది మహర్షు లలోదేవశిల్పి విశ్వకర్మ అగ్రతాంబూలాన్ని స్వీకరించినట్లు పురాణ గాథలద్వారా తెలియుచున్నది. నేటివాస్తుశాస్త్రంయొక్క ప్రాధాన్యత ఎంతో ప్రాచుర్యం పొందివున్నది. కాని నేటినవీనవాస్తు శాస్త్రవేత్తలద్వారా వాస్తుశాస్త్రం యొక్క ప్రామాణిక విలువలు నశించుచున్నది.

రామాయణ మహాకావ్యకర్త ఆదికవి వాల్మీకి మహర్షి రామా యణ కావ్యాన్ని సంస్కృతభాషలో లోకానికి తెలియజేసిరి. ఆ మహాగ్రంథం కొందరు మహనీయులు మూలభావలములకు భిన్నం కాకుండా ఎన్నోగ్రంధములు రచించిరి. కారణము రామాయణ కావ్యం నందుగల భక్తి, వాల్మీకి మహర్షినందు ఉన్న పూజ్యతాభావం. సాంప్రదాయం మీదవున్న గౌరవం వలన మూల సూత్ర ములు భంగం కానివిధంగా రామాయణ మహాకావ్యమును పద్య, గద్య కావ్యములుగా రచించిరి.

నేటి నవీనవాస్తుశాస్త్రవేత్తలు తన సొంత అభిప్రాయాలతో ప్రామాణిక సత్యములను భంగపరుస్తు వాస్తుశాస్త్ర విలువలను నశింప జేస్తున్నారు. ప్రామాణికవిలువలుకలిగిన సశాస్త్రీయమైన వాస్తు శాస్త్రము నా రాబోవు గ్రంథం విశ్వకర్మ వాస్తుశాస్త్రమునందు వివరిస్తున్నాను. ఈ వ్యాసమున నేటి నవీనవాస్తు శాస్త్రవేత్తలు ఆచరిస్తున్న అపశృతులు మరియు విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా గృహవాస్తు నియమాలు తెలియజేస్తున్నాను.

గృహనిర్మాణంలో ఆయము యొక్క నిర్మాణము ప్రధానమైనది. ఆయము అనగా ఆయుస్సు, ఆయువు పట్టు అని అర్థం. గృహం ఆయము చేతనే నిర్మించాలని దేవశిల్పి విశ్వకర్మ దేవుగురు బృహస్పతియొక్క వచనం.

గణితం లేక ఏ శాస్త్రమయిన నిరుపయోగమే. గణితం ద్వారానే ఖగోళశాస్త్రమున నక్షత్రాలు, రాశులు, వాటిమీద గ్రహసంచారం, గ్రహణములు, గ్రహఅస్తంగత్వాలు (మౌఢ్యమి),భూగోళ శాస్త్రంలో అక్షాంశ ములు, రేఖాంశములు, కర్కాటకరేఖ, భూమధ్య రేఖ, మకర రేఖ, ధృవప్రాంతాల దూరం గణితశాస్త్రం ద్వారానే సాధిస్తున్నారు, శిల్పశాస్త్రంలో దేవాలయ గర్భగుడి పొడవు వెడల్పు, దేవుని పీఠం, దేవతా విగ్రహం ఎత్తు, అంతరాళ మంటపం, ముఖమంటపం, ధ్వజస్తంభం, బలిపీఠం మొదలగు సమస్త విషయములను గణితశాస్త్రం యొక్క ప్రాధాన్యతతో మహర్షులు వివరించారు. అదేవిధంగా ధనమును లెక్కించుటకు, వస్తువుల యొక్క బరువు నిర్ణేశించు తూనికలకు, భూముల పొడవు వెడల్పు తెలుసుకొనుటకు గణితశాస్త్ర మునే ఉపయోగిస్తున్నాం. అలాగే ఉపగ్రహ (శాటిలైట్) నిర్మాణం నందు గణిత ప్రాధాన్యత వున్నది. ఆరోగ్యవంతుడయిన మానవునకు ఇన్నిసార్లే గుండెకొట్టు కోవాలని, మానవశరీరంలో ధమనులు, సిరులు ఇన్నే వుండాలని గణిత శాస్త్రం ద్వారానే వివరిస్తున్నారు, అది ఇది అనివివరించే నేల ప్రతిశాస్త్రంనకు గణితశాస్త్రమే మూలా ధారం, గణితశాస్త్రం లేని ఏ శాస్త్రమైన నిష్ఫలం అని గుర్తించవలసి వున్నది.

ఆయుష్షు లేని మానవుడు అష్టఐశ్వర్యములు వున్న ఎలా నిరుపయోగమో, ఆయంలేని గృహం కూడ అంతే నిరుపయోగం.గృహమునకు కావలసిన పొడవు వెడల్పుచే (గర్భం) గుణిం చగా ఏర్పడు సంఖ్య 9చే భాగించగా చదరపుగజాలలో గృహ పిండంవచ్చును. (పిండము అనగా మానవ

ఉత్పత్తికి మూలా ధారము) దానినే క్షేత్రపదం అని, సామాన్య గణితంలో వైశాల్యం అని వ్యవహరింతురు. పొడవు వెడల్పు హస్తములలో గాని గజము లలోగాని గ్రహించుట ప్రాచీన ఋషి సాంప్రదాయం, ప్రాచీన మతం లోని హస్తములు 18 బ్రిటిష్ అంగుళాలు, రెండుహస్తములు 36 బ్రిటీష్ అంగుళాలు లేక ఒక గజం 9 చదరపు అడుగులు ఒక చదరపు గజం అగును కావున చదరపు గజములలో గృహగర్భం నిర్ణయించుట ప్రాచీన సాంప్రదాయం. ఈ ఆయములు 1. ధ్వజాయం 3. సింహాయం 5. వృషభాయం 7. గజాయం శ్రేష్ఠమైనవి. 2. ధుమాయం 4. శ్వానాయం 6. ఖరాయం 8. కాకాయం నిషిద్దాయ ములు. గృహగణితంలో నవవర్గలు, ఏకాదశివర్గలు, చతుర్థశివర్గలు షోడశ వర్గలు, అష్టాదశవర్గలు చెప్పబడినవి. ఏకాదశవర్గలు లోకోచార మున ఎక్కువగా వినియోగించు చున్నారు. గృహపిండమును 9చే గుణించి 8చే భాగించగా శేషం ఆయమగుచున్నది. గృహపిండ మును 9చే గుణించి 8చే భాగించడంలోని గుడార్థం ఏమనగా మానవుని శరీరంలో నవద్వారములు చెప్పబడుసంఖ్య 9, అష్ట దిక్పాలకుల సంఖ్య 8, నవద్వారముల భగవత్ నిర్మితమైన ఈ దేహం అష్టదిక్కులు యేర్పరచి అష్టదికాల్పలకులకు స్థానమిచ్చు మానవ నిర్మితమైనగృహం ఈరెండు గుణించగా మానవునకు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించే ఆయము ఏర్పడుచున్నది. ఆయమును గూర్చిన మరిన్ని వివరములకు నాచేరచించబడిన విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా **ఇండ్ల ఆయములు** అనుగ్రంథములో చూడగలరు.

గృహనిర్మాణం దీర్ఘచతురస్రాకృతి స్థలం అత్యంత శుభదాయకం. కారణం ఏమన గృహకారకుడయిన గురువు దీర్ఘచతురస్త్ర మండలము నకు అధిపతి కావున. గృహమునకు ఏ విధమైన వీధిపోట్లు అయిన దుష్ఫలములను ఇచ్చును. నేటి నవీన వాస్తుశాస్త్రవేత్తలు తూర్పుఈశాన్యం వీధిపోటు, ఉత్తర ఈశాన్యం వీధిపోటు, దక్షిణ ఆగ్నేయం వీధిపోటు పశ్చిమ వాయువ్య వీధిపోటు శుభమని తెలుపుచున్నారు.

రాజవీధిపోటు రామబాణమునకు సరిపాటి అనిపెద్దల నానుడి వీధిపోటు ఏదైనను దుష్ఫలమునే ఇచ్చునుగాని సత్ఫలం ఇవ్వదు.

నేటినవీనవాస్తు శాస్త్రవేత్తలు కొన్ని వీధిపోట్లు శుభమని చెప్పడం బంగారుకత్తితో చంపిన మనిషి చావదని, ఇనుపకత్తితో చంపిన మనిషి చావునని చెప్పినట్లున్నది కొన్ని వీధిపోట్లు శుభమని చెప్పిన విషయం.

గృహమునకు సింహద్వారం విదిక్కులయిన ఈశాన్య ఆగ్నేయ వాయువ్య నైరుతులలో నిర్మించ రాదు. నేటి నవీనశాస్త్రవేత్తలు తూర్పు ముఖమునకు తూర్పు ఈశాన్యం, దక్షిణముఖమునకు దక్షిణ ఆగ్నేయం, పశ్చిమ ముఖమునకు పశ్చిమవాయువ్యం, ఉత్తర ముఖమునకు ఉత్తర ఈశాన్యం సింహద్వారములు శుభమని చెప్పుచున్నారు. ఈ సింహ ద్వారములు ఉచ్చమని తెలియజేస్తు న్నారు. దేవశిల్పి విశ్వకర్మ విదిక్కు లలో సింహద్వార నిర్ణయం అశుభప్రదమని తెలియజేసిరి. సింహ ద్వారం వాస్తుపురుషుని యొక్క నోరు అని విశ్వకర్మ అభిమతం, సింహద్వార ఇరువైపుల కిటికీలు వాస్తుపురుషుని నేత్రాలు అని విశ్వకర్మ అభిమతం నోరు మనిషికి మధ్యలో వున్నట్లు సింహద్వారం దిశలో వుండటమే శాస్త్రీయం, నేటి నవీన వాస్తుశాస్త్రవేత్తలు దిశలో వుండాల్సిన నోరులాంటి సింహద్వారాన్ని మూలలకు పెట్టి నోరు చెంపలమీద వుండు లాగున తయారుచేయు చున్నారు. సింహద్వారానికి ఇరువైపుల కిటికీలు లేకున్నా గృహయజమానికి నేత్రవ్యాధులు కలుగును. దేవశిల్పి విశ్వకర్మ, విశ్వకర్మ సంహితలో తూర్పు ఈశాన్యం లేక ఉత్తర ఈశాన్య ములలో సింహద్వారములుంచిన దరిద్రము సంభవించునని తూర్పు ఆగ్నేయం లేక దక్షిణ ఆగ్నేయాలలో సింహద్వారం వుంచిన మరణం సంభవించునని దక్షిణ నైరుతి లేక పశ్చిమ నైరుతిలలో సింహద్వారం వుంచిన వివేక శూన్యమైన సంతానం పొందుదురని, ఉత్తర వాయువ్యం లేదా పశ్చిమవాయు వ్యము లందు సింహద్వారం వుంచిన కలహ పీడలుండునని తెలియజేసిరి. పై విశ్వకర్మవచనం ద్వారా విదిక్కు లలో సింహద్వారం నిర్ణయం నిషిద్ధంగా గోచరించు చున్నది. శాస్త్రీయంగా సింహద్వార నిర్ణయం ఏమనగా ఇంటి లోపలి కొలతలు 9భాగములుగా విభజించి సవ్యక్రమములో నవగ్రహస్థానము లేర్పరచి మధ్యనున్న బుధ, గురు, శుక్రస్థానముల



యందు శుభమనితెలిపిరి. మధ్యనున్నగురుస్థానం బ్రహ్మస్థానమును సూచించును కావున దేవాలయములకు ఈ గురుస్థానం నందు సూచించిన సింహ ద్వారనిర్ణయం శుభంగా మానవ నివాసగృహములకు బుధ, శుక్ర స్థానములు సింహ ద్వారములకు శుభంగానిర్ణయించిరి.

సింహద్వారం గృహంమధ్య నుండి ఉత్తరం లేక తూర్పునకు కొన్ని అంగుళాలయిన జరిపి సింహద్వారస్థాపన చేయాలని నియమం ఉన్నది, కావున తూర్పు దక్షిణ సింహద్వారములవారు బుధ స్థానమున, పశ్చిమ ఉత్తర సింహద్వారములు శుక్రస్థానము నందు సింహద్వారం నిర్ణయించుట ప్రామాణికమైనది.

నేటి నవీనవాస్తు శాస్త్రవేత్తలు తూర్పు ముఖద్వారం వారు తూర్పు ఈశాన్యం నుండి పశ్చిమ వాయువ్యమునకు నడకసాగడం ఉచ్చమని తూర్పు ఈశాన్యం నుండి పశ్చిమ నైరుతికి నడక సాగడం నీచమని దక్షిణముఖ ద్వారమునకు దక్షిణ ఆగ్నేయం నుండి ఉత్తర ఈశాన్యం వరకు నడకసాగటం ఉచ్చమని, దక్షిణ ఆగ్నేయం నుండి ఉత్తరవాయవ్యం వరకు నడకసాగుట నీచమని, పశ్చిమముఖ ద్వారమునకు పశ్చిమ వాయువ్యం నుండి తూర్పు ఈశాన్యం వరకు నడకసాగుట ఉచ్చమని, పశ్చిమ వాయువ్యం నుండి తూర్పు ఆగ్నేయం వరకు నడకసాగుట నీచమని, ఉత్తర ముఖ ద్వారమునకు ఉత్తర ఈశాన్యంనుండి దక్షిణ ఆగ్నేయం వరకు నడకసాగుట ఉచ్చమని, ఉత్తర ఈశాన్యం నుండి దక్షిణ నైరుతికి నడకసాగుట నీచమని తెలుపుచున్నారు. పైనిర్ణయాలు ప్రామాణిక గ్రంథములలో వివరించలేదు. సింహద్వారం మాత్రం నిర్దుష్ట ప్రదేశాలలో నిర్ణయించవలెను. గృహము లోపల ఏమూల యందు వాకిళ్ళువున్న ద్వారశూలకాదని విశ్వకర్మ వాస్తుశాస్త్రమున తెలుపబడినది.

దైవమందిరం : ఈశాన్యం దైవ మందిరం అని విశ్వకర్మ వచనం ఈశాన్యంనందే దైవమందిరం స్థాపించుటకు కారణం జ్యోతిషశాస్త్ర బద్ధంగా యోచించగా ఈశాన్యదిక్కునకు గురుకేతు వులు అధిపతు లగుదురు. గురువు జ్ఞానకారకుడు, కేతువు మోక్షకారకుడు. జ్ఞానమోక్షాదులు జీవితపరమార్థా లుగా భావించి మన మహర్షులు ఈశాన్యమునందు దైవమందిర స్థాపనకు ప్రాధాన్యతనిచ్చిరి. నేటి నవీనశాస్త్రవేత్తలు నైరుతిమూలయందుకూడ దైవమందిరం నిర్మిస్తున్నారు. నైఋతిదిశకు నిఋతి అను రాక్షసుడు అధిపతి అందుచేతనే ఈ నైఋతి మూలను రాక్షసమూలగా అభివర్ణింతురు. ఈ రాక్షస మూలయందు దైవ మందిర నిర్మాణం అశాస్త్రీయమైనది.

ఈశాన్యం నందు బరువు వుండకూడదని దేవుని పీఠము నిర్మించుట దోషమని నేటి నవీన వాస్తుశాస్త్రవేత్తలు తెలుపుతున్నారు. ఈవిషయం అభూతకల్పన. దేవుడు ఎత్తైన పీఠము నందు గృహకర్త దేవునికన్నా తక్కువ ఎత్తున కూర్చుని పూజించిన సత్సంప్రదాయం. ఈశాన్యములో బరువు వుండరాదన్న సూత్రమే స్వతంత్రమైనది. ప్రామాణిక విరుద్ధమైనది దేవుని గదిలో ఎత్తైన పీఠములో దేవుణ్ని వుంచి పూజించడం శాస్త్రీయమైనదిగా గుర్తించాలి.

**వంటగది :** ఆగ్నేయం పాకసదనం అని విశ్వకర్మ వచనం, ఆగ్నేయంలో పాకశాల స్థాపనక కారణం జ్యోతిషశాస్త్రబద్ధంగా యోచించగా ఆగ్నేయదిక్కుకు శుక్రుడు అధిపతి. శుక్రుడు అగ్ని తత్వ గ్రహమయినందున స్త్రీ గ్రహమయినందున ఆగ్నేయమందు వంటగది నిర్మాణం ఉత్తమమని మహర్షులు నిర్ణయం. విశ్వకర్మ తెలిపిన దేవమానుష గంధర్వ భాగవిభజన ప్రకారం తూర్పు దక్షిణ సింహద్వారములవారు వాయువ్యగదిలో ఆగ్నేయమూలన వంటగదిగా వుపయోగించ వచ్చును. పశ్చిమ ఉత్తరసింహద్వారములవారు మాత్రం ఆగ్నేయగదిలో ఆగ్నేయమూలన వంటగదిగా వుపయోగించవచ్చు.

**రోలు నిలుపుస్థలం :** రోలు శనేశ్వరునిగా చెప్పబడినది. రోలు సింహద్వారం ఎదురుగా కనిపించ రాదు. రోలుకు పొయ్యికి మధ్య నడచిన కీడుకలుగును. రోలు పొయ్యికి అతిసమీపములో వుండవలెను. ఒక ఇంటిలో మూడురోళ్ళు వుండరాదు.

**స్నానశాల :** పూర్వశ్యాం స్నానమందిరం అని విశ్వకర్మ వచనం ఈ ప్రవచనాన్ని జ్యోతిషశాస్త్ర బద్ధంగా యోచించగా మేష సింహకర్కాటక వృశ్చిక ధనుర్ మీనలగ్నముల వారికి తూర్పు దిశాధిపతి అయిన రవి శుభుడు కావున ఈ లగ్నజులకు తూర్పు స్నానమందిరం శ్రేష్టమయినది. పై లగ్నజులకు

